# నిత్యస్వాత్మరూప సత్యసాయి
# శతకము

రచన

వై.వి. వెంకటేశ్వరరావు

# నిత్యనూత్నరూప సత్యసాయి శతకము

ప్రథమ ముద్రణము : 1997

ప్రచురణకర్తలు :

రమాదేవి అకాడమీ ఆఫ్ మల్టిపల్ ఆర్ట్స్
15, ప్రణవ, 10వ మెయిన్ 26వ క్రాస్
బనశంకరి సెకండ్ స్టేజి
బెంగుళూరు - 560 070
దూరవాణి : 6716925

ముద్రణ :

క్లీన్ ప్రింట్, ఆఫ్‌సెట్ డివిజన్
3-6-260, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 3223712

ముఖచిత్రం :

బి.వి. సత్యమూర్తి
శ్రీ సత్యసాయి డిజైనింగ్ స్టూడియోస్
లక్డికాపూల్, హైదరాబాదు.

అంకితం

భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారి

పాదపద్మములకు

# పరిచయం

జస్టిస్ వై.వి. ఆంజనేయులు
హైదరాబాద్

ఈ శతక రచయిత నా అన్నగారు. "గారు" అని సంబోధిస్తే, మానసికంగా దూరం ఏర్పడుతుందనీ, ఆంతరంగిక భక్తులు భగవంతుణ్ణే ఆత్మీయంగా సంబోధించిన సన్నివేశాలెన్నో ఉన్నాయనీ, తెలిసిన మేమిద్దరం ఏకవచనంలో సంబోధించుకుంటూ ఎంతో దగ్గరైపోయాం. నిజ జీవితంలో శారీరకంగా మేము వేరైనా మా ఆత్మ ఒక్కటే. ఎన్ని జన్మల బంధమోయిది! అయితే, ఈ సందర్భం వేరు. నేను వారిని రచయితగాను, వారి రచననూ మీకు పరిచయం చేస్తున్నాను. కనుక గౌరవ సూచకంగా వారిని బహువచనంలో సంబోధిస్తూ పరిచయం చేయడం నాలోని సభ్యతకు నిదర్శనం.

'శేషశైలవాస శ్రీనివాస' అనుమకుటంతో ఆత్మ ప్రపత్తి, లోక ప్రవృత్తి అనే రెండు భాగాలుగా 513 ఆట వెలది పద్యాలను పంచశతిగా వ్రాసి ప్రచురించిన శతక రచయిత వీరు. వేమన గారి వలె ఆటవెలది ఛందస్సు వీరికి అత్యంత ప్రీతికరమైన ఛందస్సు. నాటక, నాటికా రచయితగా ఎంతో అనుభవజ్ఞులైన శ్రీ వెంకటేశ్వరరావు గారు శతకరచనలోనూ సిద్ధహస్తులు.

శ్రీ వెంకటేశ్వరరావు గారు శ్రీ వెంకటేశ్వర స్వామి వారి ఆంతరంగిక భక్తులు. అందరు దేవతామూర్తులలో శ్రీనివాసుని, శ్రీనివాసునిలో అందరు దేవతా మూర్తు లను కనగల భక్తులు. వారి చిన్న కుమారుని వివాహ సందర్భంలో మొదటి సారి, భగవాన్ శ్రీ సత్యసాయి బాబా గారి ప్రత్యేక దర్శన భాగ్యం, శ్రీవారి పాద స్పర్శనా పుణ్యం, శ్రీ విభూతి సహితాశీర్వాదం వారికి లభించినవి. ఈ శతకంలోని మొదటి పద్యం వీరు శ్రీ స్వామి వారికి సమర్పించినప్పుడు స్ఫటిక లింగాన్ని శ్రీ స్వామివారు అనుగ్రహించారు. మావదిన గారికి అనారోగ్యంగా ఉన్నప్పుడు, నాతో

బాటు శ్రీ స్వామివారి దర్శనానికి వచ్చినప్పుడు ఈ శతకంలో "ప్రార్థన" అన్న రెండవ పద్యాన్ని చెప్పి, "అర్పణ" అన్న శీర్షికలోని అయిదు పద్యాలను చదివి శ్రీ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారికి సమర్పించినప్పుడు శ్రీ స్వామి వారు వారికి ఒక బంగారపుటుంగరాన్ని బహూకరించి, ఆశీర్వదించారు. అప్పుడు వీరు " నిత్యనూత్నరూప సత్యసాయి" అను మకుటంతో శతకాన్ని వ్రాయడానికి శ్రీ స్వామి వారి అనుమతిని సంపాదించి, ఆ పైన శతకం పూర్తి చేసి శ్రీ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి పాద పద్మములకు సమర్పించారు. ఆ శతకమే ఇప్పుడు మీ చేతిలో ఉన్న ఈ పుస్తకం. చదవండి.

ఈ శతకంలో 21 శీర్షికలున్నవి. భగవాన్ శ్రీ సత్య సాయిబాబా గారి రూపవర్ణన, వారి సూక్తులు, వారిలీలలు, వారి భక్తజన క్షేమదృష్టి వంటి విషయాలనెన్నో చక్కగా వ్రాశారు.

విశ్వప్రేమ ఆధారమైన శ్రీ స్వామి వారి శిష్టజన రక్షణాభావాన్ని, స్వార్థరహితత్వాన్ని

"స్వార్థరహితమేమొ స్వయముగా చూపిరి
ప్రభుత చేయలేని పనులబట్టి,
ప్రజకు మేలు చేయు ప్రభువువు నీవయ్య,
నిత్యనూత్నరూప సత్యసాయి" అన్న పద్యంలోనూ.

శ్రీ స్వామి వారి ప్రేమ స్వరూపాన్ని

"అందమైన పుష్పమానందమందించు
మధురమైన గీతిమనసునింపు
స్వామి చూపులందు ప్రేమ సుధలు విందు
నిత్యనూత్నరూప సత్యసాయి"

అని రెండు చక్కని ఉపమానాలను ఉపయోగించి చల్లనైన మాటలలో చెప్పారు. ఏకత్వంలోని భిన్నత్వాన్ని, శ్రీ స్వామి వారు మనకుద్బోధిస్తున్న విశ్వప్రేమ ధర్మాన్ని రచయిత

"సర్వధర్మములను సమమంచు పరికించి
ఏకధర్మముగ సమీకరించి
ధర్మబోధ చేసి ధరనింపు ప్రేమతో
నిత్యనూత్నరూప సత్యసాయి"

అని మనోరంజకంగా వ్రాశారు.

మా వదిన గారైన "రమ" ను కోల్పోయిన మా అన్నగారు "తమ ఇచ్ఛ ఆపైన" అని శ్రీ స్వామివారికి చెప్పి, "బ్రతుకవలయుగాన బ్రతుక ధైర్యము నిమ్ము" అని శ్రీ స్వామివారిని అర్థించి, ఆ ధైర్యంతోనే ముందుకు సాగుతున్నారు.

శతకాన్ని సమర్పిస్తూ వారు శ్రీ స్వామి వారిని కోరుకున్న దొకటే. "పరమువలదు నీదు పదసన్నిధియె చాలు" అని. చాలునని అంటూ కోరుకున్న కోరిక చిన్నది గానే కనబడుతున్నా, వారి కోరిక చిన్నదేమీ కాదు, పెద్దదే. మరొక పద్యంలో వారే వ్రాశారు.

"పావనమగు నీదు పాద స్పర్శకొరకు
వేచియుందురయ్య వేల భక్తు
లందరి కది ఏలా! లభ్యముకానీవు
నిత్యనూత్నరూప సత్యసాయి"

అయినా, వారు కోరుకున్న కోర్కెను భగవానులు ప్రసాదించి, వారిని ఆశీర్వదించి ఆయురారోగ్యాలతో, స్వామి ఎడల నిండు భక్తితో, దైవచింతతో శేష జీవితం గడపగలిగే వరాలను వారికి స్వామి అనుగ్రహించగలరని ఆశిస్తున్నాను.

మనోజ్ఞమైన, భక్తి భావగర్భితమైన శతకరచనమిది. చదివి, మనసారా ఆనందించండి.

సాయిరాం

వై.వి. ఆంజనేయులు

# నా మాట

"శేషశైలవాస - శ్రీనివాస" అన్న మకుటంతో ఆటవెలది ఛందస్సులో నా శతక రచన ప్రారంభమైంది. పంచశతిగా ప్రచురించడం జరిగింది. 1994 లో "అర్పణ" శీర్షికలోని అయిదు పద్యాలను భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారికి సమర్పించడంతో "నిత్యనూత్నరూప సత్యసాయి" అన్న మకుటంతో ఈ శతక రచన మొదలైంది. శతక రచనకు శ్రీ బాబా గారి అనుమతి లభించడంతో ఈ శతకం పూర్తి చేస్తానన్న విశ్వాసం, ఆత్మస్థైర్యం ఆనాడే నాకు లభించాయి. వ్రాత ప్రతిని భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారి పాదపద్మముల చెంతనిడిన నాడే నా జన్మతరించింది.

భగవాన్ శ్రీ సత్య సాయిబాబా గారి సంపూర్ణానుగ్రహం నాకు లభించిందంటే దానికి కారణం నా సోదరులు జస్టిస్ శ్రీ వై.వి. ఆంజనేయులు గారే. వారికి సదాకృతజ్ఞుణ్ణి. ఈ శతకానికి ఈ పుస్తక రూపం సమకూర్చడంలోను, పరిచయ వాక్యం వ్రాయడంతోనూ నాకు చేయూతనిచ్చినందుకు కూడా శ్రీ ఆంజనేయులు గారికి నా భ్రాతృపూర్వకాభివాదములు.

75 పద్యాలు వ్రాసే వరకు నా శ్రీమతి "రమ" నాతో ఉండి ఎంతో సంతోషించారు. ఈనాడు ఆమె నాలో ఉన్నా, బాహ్య ప్రపంచంలో లేరు. అయినా, ఆమె నాకిచ్చిన ప్రోత్సాహం చిరస్మరణీయం.

వ్రాయననుమతి ఇచ్చిన దేవదేవులు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారి అనుగ్రహం లభించగా శతకం పుస్తక రూపాన్ని సంతరించుకున్నది. ఆనాడు వ్రాతప్రతిని వారి పాద పద్మములకు సమర్పించాను. ఈనాడు ఈ ముద్రిత ప్రతిని వారికి అంకితమిస్తూ, వారి పాదపద్మములకు చేర్చగలిగాను.

ఈ శతకాన్ని చక్కగా ముద్రించి ఇచ్చిన క్లీన్ ప్రింట్ వారికి, ముఖచిత్ర చిత్రకారులు శ్రీ సత్యమూర్తిగారికి, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు వారికి నా కృతజ్ఞతతో కూడిన నమస్సులు. శేషశైలవాస పంచశతిప్రచురణలో ఆనాడు, ఈ శతక రచనలో ఈనాడు నాకెంతో ఆత్మబలాన్ని, సహకారాన్ని అందించిన నా పెద్దకోడలు చి.సౌ. రాఘవీ విజయానంద్‌కు నా అభినందనాశీస్సులు. నా రచనా వ్యాసంగానికి, కళాసేవకు దోహదమిచ్చి తోడ్పడుతున్న నా కుమారులకు, చిన్న కోడళ్ళకు, మిత్రబృందానికి నా కృతజ్ఞతలు. ఎవరెవరెంతెంత సహకరించారో, వారందరికీ కృతజ్ఞతాపూర్వక వందనాలు.

సాయిరాం

మీ

వై.వి వెంకటేశ్వరరావు

## వందనము

కరుణ మమ్ము జూచి కాపాడుదైవమా
కామితార్థ దాత ప్రేమమూర్తి,
నిత్యనూత్నరూప సత్య సాయీశ్వర
అందుకొనుము నాదు వందనములు.

(4-8-1993న భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారికి సమర్పించిన మొదటి పద్యం)

## ప్రార్థన

నన్నుమించి నీదు నామ స్మరణచేయు
భక్తురాలు నాదు భార్య 'రమ'ను
మెచ్చి, శుభములిచ్చి, మేల్జూడుదేవరా
నిత్యనూత్నరూప సత్యసాయి

(13-10-1994న శ్రీ స్వామివారి ఎదుట చెప్పిన పద్యం)

## అర్పణ

ప్రణవ శక్తినీవు, ప్రాణదాతవు నీవు
ప్రగతి పథము జూపు ప్రభువు నీవు
శరణని నిను చేర కరుణ గాచెద వీవు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ప్రేమ నందుకొనుము, ప్రేమ నందించుము,
లేదు ప్రేమ గెలువ లేనిది మహి
ననుచు ప్రేమదెలిపి, మనుజునిదీవించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

వేంకటేశుడితడె, వేద బ్రహ్మమితడె,
సత్యదేవుడితడె, సహజుడితడె,
శాంతమూర్తి ఇతడె, శంకరుడీతడె
నిత్యనూత్నరూప సత్యసాయి.

నిన్ను జూచు అరనిముసము చాలును,
మనసుపడు కలతలు మాయమౌను,
భ్రాంతి తొలగిపోవు, శాంతిలభించును
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఎవ్వరు మదిలోన నెటుల స్తుతింతురో
అట్లె వారి మనసు నాక్రమించి
అభయమిచ్చి బ్రోవు అవతారమూర్తి మా
నిత్యనూత్నరూప సత్యసాయి.

(శ్రీ స్వామి వారి ఎదుట చదివినవి, సనాతన సారథిలో ప్రచురింపబడినవి)

## సుప్రభాతము

సర్వశక్తి మంత, సర్వేశ, సర్వాత్మ,
సర్వధర్మ ప్రేమి, సంహితాత్మ,
సూర్యుదుదయమాయె, సుప్రభాతమునీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

బాలభానుని కిరణాలు చీకట్లను
తొలగచేసి భువిని వెలుగునింప,
సుమములన్ని విరిసె, సుప్రభాతము నీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

తీయగా కుహు అను కోయిల పాటలు
మెల్లనాలపించు మేల్కొలుపులు
సుధలు చిందువేళ, సుప్రభాతము నీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

పర్తివాసలెమ్ము, పరమేశ్వరాలెమ్ము,
దివ్యమూర్తి లెమ్ము, దేవలెమ్ము
సుప్రసన్నమూర్తి, సుప్రభాతమునీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

కృతుల, గీతముల నిను తనివితీరగ
భక్తి, భక్తవరులు పాడుచుండ
సుజనరక్షకుండ సుప్రభాతమునీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## అనుజుని కాశీస్సు

ఆంజనేయ, అనుజ, అందుకొమ్మాశీస్సు
అరువదెనిమిదైన తరుణమందు,
సత్పురుషుడవీవు, సద్భక్తుడవునీవు
సాయిశక్తి నీకు సాయమెపుడు.

(14-10-1994న వ్రాసి ఇచ్చినది)

## మానవ రూపంలో

విశ్వశాంతి కొరకు, విశ్వోన్నతి కొరకు
విశ్వమానవు కనువిప్పు కొరకు
జగతి మానవునిగ జన్మించినావయ్యా
నిత్యనూత్నరూప సత్యసాయి.

## సాయిప్రేమ

మిత్రులందు పరమమిత్రము దైవము
మీరె మాకు పరమమిత్రులయ్య,
సేమముంటిమయ్య మీ మిత్రప్రేమలో
నిత్యనూత్నరూప సత్యసాయి.

ధర మతములకెల్ల ధర్మసూత్రమొకటె,
పరగవలయు ప్రేమ పంచుకొనుచు,
ప్రేమపంచి మమ్ము క్షేమముంచుదురయ్య,
నిత్యనూత్నరూప సత్యసాయి.

వైద్యశాలలేమి, విద్యాలయాలేమి!
కరువుతొలగ చేయు వరములేమి!
మనుజకోటి సేమమరయ ప్రేమమునీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

భారతీయుడౌట భాగ్యమనుచు నెంచి
బ్రతుకవలయు జగతి నుతులవడసి,
దేశప్రేమికునకు దైవ ప్రేమము నిచ్చు
నిత్యనూత్నరూప సత్యసాయి.

పరుల ఇడుములందు పాలు పంచుకొనుచు
తోటి వారికింత తోడు పడుచు
ప్రేమ చూప నీదు ప్రేమ లభించును
నిత్యనూత్నరూప సత్యసాయి.

నీరు లేని ఊరు నిష్ప్రయోజనమని
తెలిసి, కోట్ల కొలది సెలవు చేసి
సీమకంతజలము ప్రేమ కల్పించితివి
నిత్యనూత్నరూప సత్యసాయి.

## శ్రీ పదములు

పరమపురుష నీదు పద పద్మములుతాకి
కనుల నలదుకొనుట కదనుదొరుక
తనువు జలదరించు, మనసు పరవశించు,
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఏమిస్వామి మిముల నెంతచూచినగాని
మరల మరల చూడ మనసుకోరు;
మీ పదముల వ్రాలి మిము శరణందును
నిత్యనూత్నరూప సత్యసాయి.

పావనమగు నీదు పాద స్పర్శ కొరకు
వేచియుందురయ్య వేల భక్తు
లందరికది ఏలా? లభ్యముకానీవు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## నీ భక్తులు

నాడు నినుకొలిచిన నారదాదిమునులు
ద్వాపరమ్మునాటి గోపికలును
నేడు ధర వెలసిరి, వీడలేకనిన్ను
నిత్యనూత్నరూప సత్యసాయి.

అహము లేని మనుజులందరి కిష్టులు
నీతి బ్రతుకువారు నిరత సుఖులు
సహృదయులు మీదు సన్నిధి కర్హులు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## మనదైవము

ఈశ్వరాంబపుత్ర, ఈశ, శ్రీశ, మహేశ
ప్రేమపూర్ణ హృదయ, రామచంద్ర
మురళిగానలోల, ముజ్జగముల రేడ
నిత్యనూత్నరూప సత్యసాయి.

సత్యసుందర శివ నిత్యమనోహర
పరమపురుష ప్రేమ భరిత నేత్ర
పుట్టపర్తివాస బృందావనవిహార
నిత్యనూత్నరూప సత్యసాయి.

చిక్కులన్ని తీర్చు శ్రీనివాసుడవీవె
సదయహృదయ, షిరిడి సాయివీవె
రమణఋషివి నీవె, రాఘవేంద్రుడవీవె
నిత్యనూత్నరూప సత్యసాయి.

సుందరము శుభదము బృందావనమ్ములో
మురళిగాన లోలు కరణితోచు
నగుమోము గలవాడు, జగమెరింగిన వాడు,
నిత్యనూత్నరూప సత్యసాయి.

## అంతరార్థము

నేను, నీవు; నీవు నేనను మాటల
అంతరార్థమెవరి కంతు పడునొ
వారెరుగుదురు నిను కారణ జన్మగా
నిత్యనూత్నరూప సత్యసాయి.

జోడి ఆదిపల్లి వాడననుచునీవు
నుడివినట్టి మాట కడుగునగల
నంతరార్థమగు ననంత శక్తివినీవె
నిత్యనూత్నరూప సత్యసాయి.

కార్యమెద్దియైన కావింపు ప్రేమతో,
ఒరుల బాధ నిడుట ఒప్పుకాదు,
అందరొకటె; సాయి అందరి రూపను
నిత్యనూత్నరూప సత్యసాయి.

మత్సరమ్ము విడచి, సత్సంగమునుకూడి
సాగనిమ్ము జన్మ సార్థకమగు
ననుచు హెచ్చరింతు ననవరతముమమ్ము
నిత్యనూత్నరూప సత్యసాయి.

మాటల నవలీల కోటలదాటించి,
చేతలందు పాపభీతిలేని
నరుని జన్మ వ్యర్థమరయుడంచు తెల్పు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ప్రకృతి నెదిరించి ప్రగతి బడయలేము,
భక్తిలేని నరుడు బండరాయి,
శాంతమున్న మనసు శాంతి సాధమను
నిత్యనూత్నరూప సత్యసాయి.

అంతులేని ఆశలధికమౌ కోర్కెలు
మనసుపాడు చేయ, మనుగడచెడు,
నిగ్రహము కలాడె నిజమానవుండను
నిత్యనూత్నరూప సత్యసాయి.

పట్టిఉంచవలయు పంచేంద్రియములను
పరగనాత్మబలము పడయు కొరకు
చపలచిత్తు బ్రతుకు విఫలము, వృధయను
నిత్యనూత్నరూప సత్యసాయి.

సకలవేదవిహిత శాస్త్రోక్తవిషయాల
లీలగనుడివి విపులీకరించి
మనుజుడెట్లు నడచుకొనగవలెనొ దెల్పు
నిత్యనూత్నరూప సత్యసాయి.

పట్టుదల, సహనము, పరిశుద్ధహృదయము
కలిగిన మనుజునకు కలుగుజయము,
సద్గుణులకునీడ, సద్భక్తులకు తోడు
నిత్యనూత్నరూప సత్యసాయి.

వలయు సహనబుద్ధి, వలయు భక్తికొలువ
గట్టితలపు; వలయుపట్టు విడుపు
కార్యసాధకునకు; కరుణ నిమ్మివన్ని
నిత్యనూత్నరూప సత్యసాయి.

సాయిరామయనుచు, సాయినాథయనుచు
సాయిమాతయనుచు, సతమునిన్ను
తలచువారి హృదుల కలతలుండగ నీవు
నిత్యనూత్నరూప సత్యసాయి.

కొన్ని ఏండ్లు కాళ్ళు కోల్పోయి పడియున్న
భక్తవరునకేదొ శక్తినిచ్చి
నడమనటుల చేసినావట నాస్వామి
నిత్యనూత్నరూప సత్యసాయి.

మదిచలించినపుడు, హృదికదలినపుడు
వ్యర్థమీబ్రతుకని వ్యధనుచెంది
నీదుమ్రోలనిలువ నిష్క్రమించు భయాలు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఇడుముల పడవైచె నిసుమంత దయలేక
దైవమనుచు క్రుంగి పోవతగదు;
ధైర్యముగలవారి దైవము మా స్వామి
నిత్యనూత్నరూప సత్యసాయి.

కుదురులేని కుండ కదలి దొరలిపోవు
నటులె పతనమౌను నాస్తికుండు;
దైవశక్తినమ్ము జీవికి తోడుండు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఓ మహానుభావ, ఓ జగదీశ్వరా
లోకరక్షకుండ, శోకహరణ
ఓ విశాలహృదయ, ఓ విశ్వవిఖ్యాత
నిత్యనూత్నరూప సత్యసాయి.

ప్రేమమనలగాంచి, ప్రేమ మదుల పెంచి
ప్రేమనొకరి కొకరు ప్రీతిపంచు
కొనుచు నుండ జూచి తనివి పొందునుతాను
నిత్యనూత్నరూప సత్యసాయి.

## విశ్వప్రేమికుడు

నిన్ను చూడగానె నన్ను నేనెమరతు,
విన్నవించబోయి, మిన్నకుందు,
నన్ని ఎరుకనీకు నాపాలిదైవమా
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఈ జగతి సమస్తమీయుగ కాలమం
దెవరి కరములందు తేజరిల్లు
నాతడె పరమాత్మ ఆతడె కరుణాళు
నిత్యనూత్నరూప సత్యసాయి.

సాయిదేవయనుచు సాగి మ్రొక్కెడివేళ
మరతునెల్ల, నీవు మదినినిండ,
స్వామి నీవెదిక్కు, ప్రేమనీదుదృక్కు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ప్రేమ జీవితమని, ప్రేమ దైవికమని
తెలిసి మనిషి మెలగ కలుగుశాంతి,
విశ్వశాంతినిచ్చు విశ్వప్రేమికుడు మా
నిత్యనూత్నరూప సత్యసాయి.

అందమైన పుష్పమానంద మందించు
మధురమైన గీతి మనసునింపు,
స్వామి చూపులందు ప్రేమసుధలు చిందు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## చేయూత

స్వార్థ రహితమేమొ స్వయముగ చూపిరి
ప్రభుత చేయలేని పనులబట్టి,
ప్రజకుమేలు చేయు ప్రభువువు నీవయ్య
నిత్యనూత్నరూప సత్యసాయి.

విద్యయొసగు విలువ విద్యార్థులకు దెలిపి,
బోధకులకు దెల్పు బోధ ఘనత;
విద్యకొరకు విశ్వవిద్యాలయమునిల్పె
నిత్యనూత్నరూప సత్యసాయి.

నీరు లేక మనిషి నిముసము మనలేదు,
నీతిలేని నాడు నీరు లేదు,
నీతి, నీరు రెండు నీదయ లభియించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఇన్ని పనులుకాదు, ఎన్నిపనులనైన
చేయుదురు జనాళిసేమమెంచి,
జనతనీతిమార్గమనుసరించిన యెడ
నిత్యనూత్నరూప సత్యసాయి.

మాతృదేశసేవ, మాతాపితరుసేవ
సద్గురువులసేవ, సంఘసేవ
చేయువారికీవు చేయూత నిత్తువు
నిత్యనూత్నరూప సత్యసాయి.

స్వార్థవలన మనిషి వర్థిల్లునన్నిట,
అర్థరహిత స్వార్థ వ్యర్థమయ్యె,
స్వార్థయందు హృదయ స్పందన హర్షించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## ధర్మగామి

నిశ్చలమగు మనసు, నిస్స్వార్థప్రేమము
కరుణచూపు చూపు; సరళమైన
మాటగల మనీషి మాననీయుడుకదా
నిత్యనూత్నరూప సత్యసాయి.

కనులు, చెవులు, నోరు కట్టుదిట్టమ్మైన
మనిషి నడచు మంచిమార్గమందు,
మార్గమంత వెలుగు, మదికి శాంతికలుగు
నిత్యనూత్నరూప సత్యసాయి.

పాపమునకు వెరచి, పరమాత్మ్రప్రేమించి
సంఘమందు నీతి సంచరించు
ధర్మగామి కెపుడు ధన్యతలభియించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## సారథి

పుట్టపర్తి ఎంత పుణ్యమౌభూమియో
నిత్యవాసి అచట సత్యసాయి,
జనన తలమునుండి జగతిని వీక్షించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఇటు సనాతనత్వ మటు నూతనత్వము
మానవోన్నతికి సమన్వయించి
జగతి రథము నడుపు జయసారథివి నీవు
నిత్యనూత్నరూప సత్యసాయి.

మనుజులందరిదొక మతము, కులము, జాతి
భాషలెన్నో, మనసు భాషయొకటె,
ఆత్మయొకటె, అటులె ఆరాధ్యుడొక్కడే
నిత్యనూత్నరూప సత్యసాయి.

జగతి రంగభూమి, జనులు నీవు మలచు
పగిది అభినయించు పాత్రవర్గ
మాడి కథను నడిపి, ఆడించుదువు నీవె
నిత్యనూత్నరూప సత్యసాయి.

చూడమనుజ జన్మ క్రీడ వంటిదికద,
ఆడవలయుదాని నాదురీతి,
ఆడురీతి దెలిపి, ఆడించునాతడె
నిత్యనూత్నరూప సత్యసాయి.

సర్వధర్మములను సమమంచు పరికించి
ఏకధర్మముగ సమీకరించి
ధర్మబోధ చేసి ధరనింపు ప్రేమతో
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఆత్మతానై యుండి ఆత్మకైవెదకుట,
కంటికగుపడదని కల్లయనుట,
వెఱ్ఱితనము కాక వేరేమి? అందురు
నిత్యనూత్నరూప సత్యసాయి.

తేటతెలుగులోన తేనెలూరు పదాల
సన్మనమున బతుకు సరళిదెలుపు
సహజరక్షలు తమ సందేశములు మాకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఏది చేసిన నది నాదిగ గ్రహియించి
ఏది పలికిననది నాదుమంత్ర
మనుచుతెలిసి, శుచిగమనుడని నీబోధ
నిత్యనూత్నరూప సత్యసాయి.

## క్షమ

మహిమలేక ఎట్లు మహిసృష్టిఆయెను?
మహిమలేక ఎట్లు మనిషి ఎదిగె?
నీ మహిమనెరుగరు, నిజముగ్రహింపరు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఇంతచేసెడి నిను సుంతగ్రహింపక
చేతకాని వ్యాఖ్య చేతురైన
నట్టివారి కూడ నిట్టె సహింతువు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## పరమాత్ముడు

వరములిచ్చువాడు తిరుమల వెలసెను,
కరుణ చూచువాడు షిరిడివెలసె,
ప్రేమమూర్తి నీవు వెలిసేవు పర్తిలో
నిత్యనూత్నరూప సత్యసాయి.

వెండితేరుపైన వేడ్కవచ్చెడివేళ
గీత తెలుపు కృష్ణరీతిదోచె,
వేలకనులుకూడ చాలవు నినుగన
నిత్యనూత్నరూప సత్యసాయి.

దివ్యతేజమలర దీపాల కాంతుల
మెరయు ఊయలందు మెల్లనూగు,
లాలి వినుచు మానవాళిని వీక్షించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## సంకీర్తన

భజన చేయుడయ్య భగవానునామము
భక్తి ప్రజ్వరిల్లు భజన చేయ,
నామస్మరణ సేయ నానందమౌమీకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

అన్నమయ్యపాడె నానందనిలయుపై,
రామదాసు పాడె రాముపైన,
నిన్ను శతవిధాల నెన్నుచు పాడెద
నిత్యనూత్నరూప సత్యసాయి.

## స్వర్గీయ 'రమ'

నిన్ను కొలిచిన 'రమ' నన్నువీడి వెడలె
నామెలేని జన్మ కేమిఅర్థ
మరయలేని నన్ను కరుణించి కాపాడు
నిత్యనూత్నరూప సత్యసాయి.

'సాయిరామ' అనుచు సతమునిన్నెదలచె,
నడకనీయమనుచు నడిగెను 'రమ'
నడువలేదుకాని, కడకునీలోచేరె
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఒకరి కర్మకు మరియొకరు బాధ్యులుకారు,
తానుబాధపడుచు దాటెను 'రమ',
'రమ'నుకోలుపోతి, తమ ఇచ్ఛ ఆపైన
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఏమి జన్మమయ్య ప్రేమకొలుచు 'రమ'
భువిని నన్నువిడచి, దివిని చేరె,
బ్రతుకవలయుగాన బ్రతుక ధైర్యము నిమ్ము
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఎందరున్ననేమి? ఎంత యుండిననేమి?
సతిని బాసిన పతి బ్రతుకు బరువు;
మోయవలయు దాని మోక్షప్రాప్తికొరకు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## విశ్వరూపుడు

కల్లగా దలపకు, కనలేక దైవమ్ము,
నమ్ముమతని యునికి, వమ్ముకాదు,
విశ్వసించుమయ్య, విశ్వరూపుడితడె
నిత్యనూత్నరూప సత్యసాయి.

నామజపము సేయ నారాయణుడు మెచ్చు,
జపముకంటె మెచ్చు జనతసేవ,
సేవచేయువారి నీవు హర్షింతువు
నిత్యనూత్నరూప సత్యసాయి.

సృష్టికర్త బ్రహ్మ, సృష్టికారిణితల్లి,
కాన మాత బ్రహ్మ కాంచిచూడ,
మరువరానిమాట 'మాతృదేవోభవ'
నిత్యనూత్నరూప సత్యసాయి.

జగతి రక్షకుండు, జగమేలు విష్ణువు
బిడ్డలకు రక్షకుడు పితరుడెకద,
విష్ణు సముడు తండ్రి "పితృదేవోభవ"
నిత్యనూత్నరూప సత్యసాయి.

కనుల ఎదుటనున్న తన తలిదండ్రుల
సేమమెంచి వారి సేవ జేయు
తనయుల తగమెచ్చి తనివారదీవించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఎంతకష్టమైన సుంతయువగవని,
కలిగెను సుఖమనుచు గర్వపడని
నిర్మలాత్ములకిల నీడగ నిలిచేవు
నిత్యనూత్నరూప సత్యసాయి.

మాతపైన ప్రేమ, మాతృదేశముపైన,
మాతృభాషపైన, మాటపైన
గౌరవమును చూపు వారిపై నీ ప్రేమ
నిత్యనూత్నరూప సత్యసాయి.

ప్రేమ మెచట నుందు, నేమముండెడిచోట
నుందు శాంతి, ప్రేమముందుచోట
నిన్నియున్నచోట, నిత్యముందునతడె
నిత్యనూత్నరూప సత్యసాయి.

"మేరియోమెజలిని"కోరి నీదరి చేర
నాతని మనసునకు శాంతినిచ్చి
దివ్యపురుషుచేసి, దీవించె నాస్వామి
నిత్యనూత్నరూప సత్యసాయి.

"మేరియోమెజలిని" ఇటలీదేశస్థుడు

నీదు భక్తురాలు, నీ కథారచయిత్రి
గాలిశారదమ్మ కాదరమున
'పెద్దబొట్టు' పేరు పెట్టి మెచ్చితివీవు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ప్రేమతోడ మాదు సేమము నరయుచు
ప్రేమహృదయ మందు పెంపుచేసి
ప్రేమపంచి ఇచ్చు ప్రేమ స్వరూపుడు
నిత్యనూత్నరూప సత్యసాయి.

మనిషిలోని మనసు, మాసినవలువలా,
చలువ చేయుదాని సద్గుణుందు,
నిర్మలముగ నుంచ, నిను దరి రానిచ్చు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఏది సత్యమయ్య, ఏది నిజమురయ్యా,
ఈ పదముల కర్థమీవె తెలియ,
నిత్యసత్యమొకటె నీలోని దైవము
నిత్యనూత్నరూప సత్యసాయి.

రాముడైననీవె, రావణుడవునీవె,
చేయు పనుల మంచి చెడులవలన,
ననుచు ధర్మసూత్రమును మనకెరిగించు
నిత్యనూత్నరూప సత్యసాయి.

సకల శాస్త్రములను చదివిన చాలదు,
చదువవలయు దీనచరితులకథ,
చదివి వారిసేవ జరుపు వారినిమెచ్చు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఎందుకో తెలియని వందనమెందుకు?
మంత్రపఠనమేల యంత్రమువలె!
తెలిసి తలచినంత, తిలకించు దయతోడ
నిత్యనూత్నరూప సత్యసాయి.

గోప బాలుడితడు, గోవిందుడీతడు,
రామచంద్రుడితడు ప్రేమమయుడు,
సుందర వదనుండు, సూర్యతేజుడితడు
నిత్యనూత్నరూప సత్యసాయి.

పరముగనిన వారెవరు లేరు భువిలోన
పరమెరిగినవాడు పరగ నొకడె
పరమపురుషుడతడు, పరమాత్ముడాతడె
నిత్యనూత్నరూప సత్యసాయి.

పరమగురుడవీవు పరమాత్ముడవు నీవు
పరమశక్తివీవు, పర్తివాస,
పరమువలదు నీదు పదసన్నిధియెచాలు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఎన్నొరీతుల మనకెన్నొ బోధలుచేయు
నటులె మనకు దరిశనమ్ము నీయు,
పిలిచి, పలుకరించు, కలివెలసినస్వామి,
నిత్యనూత్నరూప సత్యసాయి.

నిన్నుదలచిన చాలు, తనుమనములుపొంగు
నిన్ను చూడగ హృది నిర్మలమగు,
నీపలుకుల జగతి నిండును ప్రేమతో,
నిత్యనూత్నరూప సత్యసాయి.

పుట్టపర్తివాస, పూజ్య, శ్రీసాయీశ
నిన్నుచూచు భాగ్యమెన్నగలిగె
నింతకన్న భాగ్యమెంతదైన వలదు
నిత్యనూత్నరూప సత్యసాయి.

## సమర్పణము

శతకము రచియింప శక్తినిచ్చిన స్వామి,
బ్రతుక బలమొసగిన భక్తసులభు
డరయ, నియమవ్రతుల పరమాత్ముడాతడె
నిత్యనూత్నరూప సత్యసాయి.

భాషనిచ్చినాడు, భావమొసగినాడు,
పద్యములను వ్రాయ పట్టుదలను,
నాకొసంగి నన్ను నాదరించినవాడు
నిత్యనూత్నరూప సత్యసాయి.

ఆశ్రయించినాడ నాటవెలది ఛంద
మరయగ, తమ నామమాయెమకుట
మిడితి శతకమాల మీపదమ్ముల మ్రోల
నిత్యనూత్నరూప సత్యసాయి.

శరణు శరణుస్వామి, శతకమిదిగొస్వామి,
వ్రాయమనిరిమీరు, వ్రాసినాడ
'రమ'కు నచ్చినవివి, తమకు నచ్చినచాలు
నిత్యనూత్నరూప సత్యసాయి.